

# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక

ఏప్రి. 1995



శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవి

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

**2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)**

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**
**హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండి నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండి విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించవలసిందిగా వైశ్యమహనీయులను కోరుచున్నాము.

పిచ్చేనమెల్ల సుబ్బారాయుడు శ్రేష్ఠి
అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి
ప్రధాన కార్యదర్శి

V.P. - A5

తైల ప్రపంచములో మణి దీపాలు




# MR
## బ్రాండ్

డబుల్ రీఫైండ్
గ్రౌండ్‌నట్ ఆయిల్
డబుల్ రీఫైండ్
సన్‌ఫ్లవర్ ఆయిల్
మరియు
డబుల్ ఫిల్టర్
గ్రౌండ్‌నట్ ఆయిల్

" ఆరోగ్య
సంరక్షణలో
ఇప్పటికీ వీటిదే
పై చేయి "

1, 5, 15 కే.జీ.ల
ఆకర్షణీయమైన
ప్యాకింగులలో
లభించుచున్నవి.

గుర్తుంచుకోండి
ఎం.ఆర్. బ్రాండ్
వంటనూనెలు అతి
ప్రశస్తమైనవి – అతి
స్వచ్ఛమైనవి.

**MADHU REFINARY PRIVATE LIMITED**
**GOOTY (RS) - 515 402. ANANTAPUR Dt.**
✆ :31, 64, 74.

✆ : Offi : 231, 264, 398, 399. Resi : 274.

**MADHU SOLVENT EXTRACTIONS (PVT.) LTD.,**
Station Road, GOOTY R.S. - 515 402. Anantapur Dt.

**Manufacturers of : DEOILD CAKES & SOLVENT EXTRACTED OILS.**

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం స్థాపితం : 1961 బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

✆ : 2262 ప్రకాశం జిల్లా. ✆ : 3158 (S.T.D. 085195) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జ్యోతిర్ లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన పవర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



స్థాపితము

1969



సంపుటి

26



సంచిక

8



ఏప్రిల్ - 199[illegible]



సంపాదకులు :

'సంఘోద్ధారక

వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

ఫోన్ : 45025

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్'

జయనగర్ కాలనీ,

విద్యామందిర్

తూర్పు భాగం

కడప - 516 002.


సంపాదకీయం

## పన్నులను పెంచి - మళ్ళీ సమస్యను మళ్ళీ మొదటికి తేవద్దు

బాధ్యత ఉన్నపుడు మాట్లాడే మాటలకూ, బాధ్యత లేనపుడు మాట్లాడే మాటలకూ - గల - తేడా తెలుసుకొనేందుకు- అమ్మకం పన్ను విషయములో రాష్ట్ర ముఖ్యమంత్రిగా శ్రీ యన్టీఆర్ మాట్లాడే మాటలు - మంచి ఉదాహరణ .

అందుకే - సలహా ఇవ్వడం సులభం. ఆ సలహాను కార్యరూపంలో చూపెట్టడం కష్టము అంటారు.

గత కాంగ్రెసు ప్రభుత్వం టర్నోవర్ ట్యాక్సును విధించినపుడూ - ఆ తరువాత రాజా చెల్లయ్య సంఘం సిఫార్సుల్లో ఒకటైన 'వ్యాట్' పద్ధతిని ప్రవేశపెట్టదలచినపుడూ ఇదే తెలుగుదేశం పక్షము వారు, ఆ పక్ష నాయకుడుగా శ్రీ యన్టీఆర్ - పై రెండింటి అమలునూ గట్టిగా వ్యతిరేకించారు. ఆ చర్యలవల్ల ధరలు పెరిగి సామాన్య ప్రజలు ఇబ్బందులు పడ్తారని గగ్గోలు పడ్డారు. అంతటితోనే తృప్తిపడక ఆ రెండింటి విషయంగా వ్యతిరేకతను ప్రకటించిన రాష్ట్రములోని వర్తక సంఘాల నాయకుల గొంతులో గొంతును కూడ కలిపారు.

ఆ పార్టీయే ఇప్పడు అధికారములోకి రాగానే, ముఖ్యమంత్రియైన ఆ పార్టీ నాయకుడే ఈనాడు సాధ్యమైనంత మేరకు అమ్మకంపన్నును పెంచారు. కొన్ని వస్తువులపై 'వ్యాట్' పద్ధతిని ప్రవేశపెట్టా మంటున్నారు.

అధికారములో ఉన్నది తెలుగుదేశం పక్షమైనా, కాంగ్రెస్ పక్షమైనా ప్రజల సమస్యల విషయములో ముఖ్యంగా ధరల పెరుగుదల విషయములో ఒకే పద్ధతిలోనే ఆలోచించాల్సి ఉంటుంది. అంతే కానీ అవకాశాన్ని తమకు అనుకూలంగా మలచుకోనాలని చేసే ప్రయత్నాన్ని ప్రజలు సహించరు.

అందుకే 'వ్యాట్' పద్ధతిని ప్రవేశ పెట్టాలనుకుంటున్న ఈనాటి రాష్ట్ర ప్రభుత్వపు టాలోచనలకు రాష్ట్రములోని ప్రధాన వర్తక సంఘాలన్నీ తమ వ్యతిరేకతను ప్రకటించాయి. కాంగ్రెసు ప్రభుత్వములో ఏ స్థాయిలో తమ వ్యతిరేకతన్నూ, నిరసననూ తెలియజేశాయో. అదే స్థాయిలో తమ వ్యతిరేకతనూ, నిరశననూ ఇప్పడు తెలుపుటకు ఉద్యుక్తమవుచున్నాయి.

దొరతనం చేసే వారు ఏ పార్టీవారైనా ఇప్పుడున్న పన్నులను ఏ రకంగా పెంచినా ప్రజలు భరించలేరు. వారిది ఇప్పుడు గలిష్ట స్థితి. ఇక వర్తక సంఘాల పరిస్థితి ఇప్పటికే విషమంగా ఉంది. ఇలాంటి నూతన ప్రయత్నాలు జరిగితే వారి స్థితి మరీ భయంకరమూ, ప్రమాదకరమూ ఔతుంది.

"కాంగ్రెసు ప్రభుత్వము తమ యెడల అనుసరిస్తున్న వైఖరి, తమను మరింతగా అమ్మకం పన్ను శాఖాధికారుల ముందు తలలు వంచే పరిస్థితికి తెచ్చేందుకు వీలుగా చేయడము వంటి చర్యల వల్లనే ఈనాటి తెలుగుదేశం ప్రభుత్వం అధికారాన్ని హస్తగతం చేసుకొనుటలో రాష్ట్రములోని వర్తకులు తమ వల్ల కాగలిగినంతా చేశారు" అనేది ఈనాటి తెలుగుదేశం ప్రభుత్వం మననం చేసుకోవడం అవసరము.

వర్తకుల మనో భావాలనూ - ప్రజల ఆకాంక్షనూ గుర్తించక అధికృత ఉన్నదన్న అహముతో చరిస్తే గత ప్రభుత్వాలకు వర్తకులూ, ప్రజలూ - ఏ బుద్ధి చెప్పారో అదే బుద్ధి చెప్తారన్నది నిత్యమూ గుర్తించి గుర్తులో ఉంచుకోవలసినది.

పన్ను రేట్లను పెంచవద్దనీ, పన్ను విధింపు పద్ధతి జటిలంగా ఉండకూడదనీ, అమ్మకంపన్ను అధికారుల ఇనుప చక్రాల క్రింద మరింతగా నలిగి పోకుండా తాము ఉండే తీరులో పన్ను విధింపు విధానం ఉండాలనీ - ఇప్పటికే సామాన్య ప్రజల వినియోగ శక్తి బాగా తగ్గిపోయిన విషయాన్నీ - హేతుబద్ధకంగా అవగాహన చేసుకొని - ఆలోచించమనీ రాష్ట్రములోని - సర్వ వర్తక సంఘాలు ప్రతి ప్రభుత్వాన్నీ కోరుకుంటున్నాయి. పన్ను విధింపు సరళతమంగా ఉండేందుకు గానే - వర్తక సంఘాలు ప్రతి వస్తువుపైనా రాష్ట్రములో జరుగు మొదట అమ్మకం దశలోనే పన్ను విధింపు జరుగునట్లుగా ప్రస్తుతం అమలులో ఉన్న 1957 ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకం పన్ను చట్టాన్ని సవరించమనీ కలకాలంగా ఆయా కాలాలలో అధికారములో ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలకు రాష్ట్రములోని వర్తకులు విజ్ఞప్తులు పంపుచూనే ఉన్నారు. మొరపెట్టుకుంటూనే ఉన్నారు.

సహేతుకంగా ఆలోచించగలిగితే ఈ ఒకే దశలో పన్ను విధింపు పద్ధతి, అందునా రాష్ట్రములో జరుగు మొదట అమ్మకం దశలో పన్ను విధింపు జరగడం అటు ప్రభుత్వానికీ, వర్తకులకూ - ప్రజలకూ కూడ శ్రేయోదాయకమైనది. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వాలకు ఆదాయం గణనీయంగా పెరుగుతుంది. పన్ను ఎగవేత బాగా తగ్గుతుంది. వసూలు కొలకు చేసే సిబ్బంది వ్యయమూ తగ్గుతుంది. అధికారులు పెట్టే బాధలనుండీ వర్తకులకు విముక్తి లభిస్తుంది. తద్వారా, మరింత ఉత్సాహంగా - నైతికంగా కూడ వర్తకులు తమ వృత్తి ధర్మాన్ని నిర్భయంగా సాగించగలుగు తున్నారు.

రాష్ట్రములోని వర్తకులూ, వారికి ప్రాతినిధ్యము వహించే వర్తక సంఘాల నాయకులూ - రాష్ట్రములోని పన్నుల వ్యవస్థను సహేతుకంగా - అమలుకూ - ఆచరణకూ - సులువుగా పునర్వ్యవస్థీకరించమని రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరుచూ, అటువంటి దశలో తమతో హృదయం విప్పి చర్చించమనీ కూడ పదే పదే విజ్ఞప్తులు చేస్తున్నాయి. ఈ విషయములో కూడ వారికి ప్రతి దఫా నిరాశే ఎదురగుచూ ఉంది. సహేతుకమైన ఈ వర్తకుల కోర్కెను ఈనాటి తెలుగు దేశం ప్రభుత్వం పూర్వాపరాలను దృష్టిలో ఉంచుకొని పరిశీలించి, అటువంటి అవకాశాన్ని వర్తకులకు కలిగించడం ముదావహంగా ఉంటుంది.

# ప్రొద్దుటూరు ప్రథమ పౌరులుగా

# శ్రీ కామిశెట్టి సుబ్బరావు



19.3.1995వ తేదీన కడప జిల్లా ప్రొద్దుటూరు పురపాలక సంఘాధ్యక్ష పదవికి జరిగిన ప్రతిష్టాత్మకమైన ఎన్నికల్లో 'ప్రజాబంధు' 'దానశీల' శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు సదరు పురపాలక సంఘానికి అధ్యక్షులుగా ఎన్నికయ్యారు. ధార్మిక హృదయులు, సుమనస్కులు అయిన శ్రీ సుబ్బరావు గారు, శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్‌కు అధ్యక్షులు. కడపజిల్లా ఆర్యవైశ్య సంఘానికి మాజీ అధ్యక్షులు. లలిత కళాప్రియులు, సరళ స్వభావులు అయిన శ్రీ సుబ్బరావు గారు 1939వ సంవత్సరములో కడప జిల్లాకు చెందిన రేకలకుంట గ్రామములో జన్మించారు. ప్రొద్దుటూరులోని పురపాలక సంఘ ఉన్నత పాఠశాలలో విద్యాభ్యాసం చేసి 1956లో స్కూల్ ఫైనల్ పూర్తి చేశారు.

శ్రీ సుబ్బరావుగారి తండ్రి చిన్న వెంకట సుబ్బయ్య శ్రేష్ఠి. తల్లి శ్రీమతి సావిత్రమ్మ. కీ॥ శే॥ వెంకట సుబ్బయ్య గారు ప్రొద్దుటూరులో నీలిమందు వ్యాపారం చేసేవారు. మద్రాసు వాస్తవ్యులు శ్రీ ముత్యాల పెద్దపుల్లయ్య శ్రేష్ఠి గారి కుమార్తె శ్రీమతి పెద్ద చెన్నమ్మతో వీరి వివాహం 1956లో జరిగింది. శ్రీ దొంతు బాల ఓబయ్య శ్రేష్ఠి గారి ప్రోత్సాహముతో వీరు 1960లో మండీ వ్యాపారాన్ని ప్రారంభించారు. 1970 నుండీ 1975 వరకూ శ్రీ అంబటి కోటి గంగయ్య గారితో కలిసి రసాయనిక ఎరువుల వ్యాపారాన్ని చేశారు. 1976లో 'శ్రీ లక్ష్మీనరసింహ ఎక్స్ పోర్ట్ ఇండస్ట్రీస్' అను పేరుతో సాల్వెంట్ ఫ్యాక్టరీని స్థాపించారు. ఈ ఫ్యాక్టరీలో ఎందరో కార్మికులకు ఉపాధి లభిస్తూ ఉంది. చిన్నమ్మ కరుణించింది. సిరి బంగారు గజ్జెలతో ఇంట తాండవమాడడం ఆరంభించింది. ప్రొద్దుటూరులోని శ్రీ వేమన ఆయిల్ ట్రేడింగు, శ్రీ రామా ట్రేడింగు కంపెనీలు మొదలగు పలు వ్యాపార సంస్థల్లో భాగస్వాములయ్యారు. ఆ తరువాత శ్రీ వివేకానంద ఏజెన్సీస్‌ను స్థాపించారు. ఆయన స్థాపించిన, ఆయన భాగస్వాములుగాగల వ్యాపార సంస్థలన్నీ కూడ బాగా అభివృద్ధి చెందాయి. ఆశించిన మేరకు లాభాలనూ ఇచ్చాయి. అనేక ధర్మ కార్యాలకూ, కళ, సాహిత్యాది పోషణకూ ఉదారంగానూ, భారీగానూ విరాళాలు ఇస్తూ ఉన్నారు. 'జీవిత పరమార్థం కేవలము సంపాదనే కాదు. సమాజసేవ చేయడం కూడ'-అన్న ఆర్యోక్తిని సార్థకం చేస్తూన్నారు.

వీరి ఈ ధార్మిక, సత్వ గుణము, ప్రజా సేవానురక్తి, మంచితనము - అన్నీ కూడ ప్రొద్దుటూరు పురపాలక సంఘాధ్యక్షపదవికి

జరిగిన ఈ ఎన్నికల్లో విజయాన్ని చేకూర్చుటకు ఎంతో గొప్పగా సహకరించాయి. స్థానిక శాసన సభ్యులు శ్రీ నంద్యాల వరదరాజులు రెడ్డి గారు వీరి యీ విజయానికి అనిర్వచనీయమైన కృషి చేశారు. శ్రీ సుబ్బరావు గారి ఎన్నిక వల్ల పట్టణానికి కొంతైనా మేలు జరుగ గలదన్న ప్రగాఢ విశ్వాసమే శ్రీ వరదరాజులరెడ్డి గారు ఇంతగా శ్రమించడానికి కారణము.

ప్రొద్దుటూరులో ఒక ఉచిత హోమియో వైద్యశాలనూ, పట్టణములో మూడు చలివేంద్ర కేంద్రాలనూ నిర్వహిస్తున్నారు. విద్యాభివృద్ధికి కృషి చేయాలన్న లక్ష్యముతో 'శ్రీ కామిశెట్టి సుబ్బరావు, శ్రీమతి చెన్నమ్మ ఎడ్యుకేషనల్ సొసైటి'ని స్థాపించారు. 'శ్రీ కామిశెట్టి సుబ్బరావు శ్రీమతి చెన్నమ్మ డిగ్రీ కాలేజి' అను పేరుతో ఒక స్నాతక కళాశాల ప్రొద్దుటూరులో నడుస్తూ ఉంది. ఈ

29.3.1995వ తేదిన పురపాలక సంఘాధ్యక్షులుగా ప్రమాణ స్వీకారం చేస్తున్న శ్రీ సుబ్బరావు గారు. ప్రమాణం చేయిస్తున్న కడప జిల్లా కలెక్టర్ డాక్టర్ పి.సుబ్రహ్మణ్యం గారు, ప్రక్కనున్న మునిసిపల్ కమీషనరు శ్రీ భోగయ్య గారు.

ఘటికాచల క్షేత్రము (షోళింగర్)లో ఆర్యవైశ్య నిత్యాన్నదాన సత్రాన్ని ప్రారంభించుటకూ, దాని అభివృద్ధికి కృషి చేసిన వారిలో ప్రప్రథమంగా పేర్కొన దగిన వారు శ్రీ సుబ్బరావు గారు.

'శ్రీ కామిశెట్టి సుబ్బరావు శ్రీమతి చెన్నమ్మ చారిటబుల్ ట్రస్టు'ను ప్రొద్దుటూరులో స్థాపించి, ఆ ట్రస్టు తరఫున కళాశాల భవన నిర్మాణానికి వీరు రు.2,50,000/- విరాళంగా ఇచ్చారు.

ప్రొద్దుటూరులోని కళా భారతి, కళా సాహితి, సర్దార్ ఫ్రెండ్స్ అర్సు, యువ కళా సమితి, శ్రీ కృష్ణదేవరాయ కళానికేతన్, వాసవీ ప్రసూతి కేంద్రము, బ్రహ్మకుమారీ ఈశ్వరీయ విశ్వవిద్యాలయము, దివ్యజ్ఞాన సమాజము - మొదలగు విభిన్న రకాల

వైశ్యప్రబోధిని, ఏప్రిల్, 1995

సంస్థలతో సంబంధముగల శ్రీ సుబ్బరావు గారు ఆంధ్రప్రదేశ్‌లోనే అతి పెద్దదగు ప్రొద్దుటూరు ఆర్యవైశ్య సభకు ఉపాధ్యక్షులుగా కూడ ఉండినారు.

'ప్రజాబంధు' అనేది శ్రీ సుబ్బరావు గారి ప్రజాహిత సేవకు మెచ్చి వచ్చిన బిరుదు. 1990వ సంవత్సరములో విజయవాడలో జరిగిన ఒక గొప్ప సభలో హైద్రాబాద్ పట్టణం ప్రధాన కార్యస్థానంగా గల రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య వీరిని 'దానశీల' అను బిరుధుతో సత్కరించింది.

కడప పట్టణం ప్రధాన కార్యస్థానంగా గల శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ వారు ప్రతియేటా ఇవ్వాలనుకొన్న శ్రీ దర్శిచెంచయ్య గుప్త అవార్డును ప్రప్రథమంగా స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ కె.సి.గుప్త గారికి ఇచ్చుటకు శ్రీ సుబ్బరావు గారు రూ.1500/-లు విరాళంగా ఇచ్చి, ఆ సమాఖ్య ప్రారంభించిన ఈ అవార్డు కార్యక్రమానికి మంచి మనస్సుతో తోడ్పడ్డారు.

## గుప్తగారి శ్రీ కన్యకా పురాణ ప్రచురణకు తోడ్పడండి

**- శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠం విజ్ఞప్తి**

మహాకవులు, అవధాని శేఖరులు శ్రీ దోమా వెంకటస్వామి గుప్త గారు వ్రాసిన శ్రీ కన్యకాపురాణ ప్రచురణను పై పీఠం వారు ఆరంభించారు. రూ.116/-లు పంపి ఈ ప్రచురణకు తోడ్పడవలసిందిగా పై పీఠము వారు విజ్ఞప్తి చేస్తున్నారు. రూ.116/-లు పంపిన వారికి ఒక ప్రతిని పంపుతారు. అట్టివారు పీఠములో జీవితసభ్యులుగా కూడ ఉంటారు. రూపాయలను డి.డి.ద్వారా పంపువారు ఆ డి.డి.ని. 'శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్య పీఠము' పేర ప్రొద్దుటూరులోని ఏ షెడ్యూలు బ్యాంకులో నైనా నగదు అగునట్లుగా, శ్రీ దోమా వెంకటస్వామి గుప్త సాహిత్యపీఠం, కేరాఫ్ వైశ్యప్రబోధినీ కార్యాలయం, జయనగర్ కాలనీ, కడప-516 002 అడ్రసుకు పంపాలి. రూపాయలను యం.ఓ. ద్వారా పంపువారు నేరుగా పై అడ్రసుకే పంపవచ్చు.

గుప్త గారి గ్రంథాలు వెలుగు చూచుటకు తోడ్పడడం ప్రతి వైశ్యుడూ తమ విధిగా, కర్తవ్యంగా భావించాలి.

### ఇంతవరకూ అందిన విరాళాలు

రు.116-00 శ్రీ రామయ్య గారు, నంద్యాల.

రు.116-00 శ్రీ సుబ్రమణ్యం గారు, తణుకు.

రు.116-00 శ్రీ అరిశెట్టి గున్నయ్య గుప్త, సాలూరు.

రు.116-00 డా॥ కె.యం.సుబ్బ రంగయ్య, తాడిపత్రి.

రు.1116-00 శ్రీ విజయా బాడీ కేర్ ప్రొడక్ట్ ప్రై లిమిటెడ్, మద్రాసు.

రు.1500-00 శ్రీ విజయా బాడీ కేర్ ప్రొడక్ట్ ప్రై లిమిటెడ్, మద్రాసు. (ఈ పీఠం తరపున ఇవ్వదలచుకొన్న అవార్డుకు మొత్తములో సగము)

రు.216-00 శ్రీ దాసా వెంకటేశ్వర్లు, ప్రొ॥ దాసా టెక్స్‌టైల్స్, హిందూపురం.

# శ్రీ వాసవీ జయంతి - మే 10న

ప్రపంచములోనే ప్రథమ సత్యాగ్రహి శ్రీ వాసవీదేవి. కలియుగమున జరుగనున్న వర్ణాశ్రమాచార ధర్మ విచ్ఛితిని అరికట్టుటకై ఆదిశక్తి స్వయంగా వాసవిగా జన్మించింది. తేనె లొలుకు - తెలుగు గడ్డను - పవిత్ర గోదావరీ తీరాన - కారణజన్ములైన శ్రీ కార్య స్థానంగా గల శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ ఈ జయంతి ప్రాశస్త్యాన్ని, చేయవలసిన విధి, విధానమునూ ఆ సమాఖ్య ప్రచురిస్తున్న 'వాసవి' ద్వారా రాష్ట్రములోని శ్రీ వాసవీ

## గుర్తుంచుకోండి

## ఆర్యవైశ్యులుగా మీ కర్తవ్యము

శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి మన, ఆర్యవైశ్యులకు కులదేవత. ఆమె వాసవిగా కలియుగమున జన్మించినది వైశాఖ శుద్ధ దశమి. ఆ తిథి ఈ సంవత్సరం 10.5.1995 ఆదివారము అగుచున్నది. ఆయమ్మను భక్తి శ్రద్ధలతో - ఆమె నామావళితో పూజించి నైవేద్యాన్ని సమర్పించడం ప్రతి వైశ్యుడూ విధిగా చేయాలి. ఆ రోజు ఉదయాన్నే శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య తయారు చేయించిన అధికారిక శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ సుప్రభాత శ్రవణముతో - ఆ తల్లిని తమ హృదయార విందాలలో మేల్కొలుపు కోవాలి. దివ్యమైన ఆ తల్లి సహస్రోత్తర నామావళిని సంస్మరించి, ఈ జయంతి కార్యక్రమాన్ని ప్రారంభించాలి.

ఇంటి ముంగలిని శుభ్రపరచి, రంగ వల్లులతో అలంకరించాలి. గృహ ముఖ ద్వారానికి మామిడి తోరణాలను కట్టాలి.

కుసుమాంబా, కుసుమార్య దంపతులకు ఆ తల్లి జన్మించింది వైశాఖ శుద్ధ దశమి. ప్రపంచ చరిత్రలోనే అత్యంత పవిత్రత-ప్రసిద్ధిని బొందిన ఆ తిథి - ఈ (1995) సంవత్సరం రానున్న (మే) నెల 10వ తేదీ బుధవారం అగుతున్నది. కడప, ప్రధాన దేవ్యాలయాల నిర్వాహకులకు తెలియ జేసింది. వాసవీ ఆలయాల నిర్వాహకులు ఆ పత్రికను తప్పక చదవాలి. ఆ ప్రకారం చేయాలి. ఆ వాసవిని ఆ సమాఖ్య తన దృష్టికి వచ్చిన రాష్ట్రములోని అన్ని వాసవీ ఆలయాలకూ - ఆర్యవైశ్య ధర్మ సంస్థలకూ పంపుతుంది.

# రాజంపేటలో వెంకటరత్నానికి సన్మానం

ప్రతి యేడూ - అమరజీవి పొట్టి శ్రీరాముల జన్మదినోత్సవాన్ని తప్పక జరిపించి, ఆ ఉత్సవ సభలో నిజమైన ఒక కార్యకర్తను - తప్పక సన్మానించాలి - అను నియమాన్ని ఉంచుకొన్న కడప జిల్లా రాజంపేట ఆర్యవైశ్య యువజన సంఘము వారు - ఈ సంవత్సరము గత (మార్చి) నెల 15వ తేదీన శ్రీ తటవర్తి వెంకటరత్నం గారిని ఘనంగా సన్మానించి, జ్ఞాపికను బహూకరించి, వెంకటరత్నము గారు వైశ్య సంఘానికి చేస్తున్న సేవలకు కృతజ్ఞతలు తెల్పుకున్నారు.

శ్రీ వెంకటరత్నం గారు ప్రసిద్ధ న్యాయవాదులు. మంచి కార్యకర్త. నిగర్వి. ఎప్పుడూ వైశ్యకుల శ్రేయస్సును గురించే ఆలోచిస్తూ - కృషి చేస్తూ ఉన్న వారు. శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్ర ప్రదేశ్ న్యాయ సలహా విభాగం సభ్యులుగా ఉంటూ ఆ సమాఖ్య రాష్ట్రములోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల స్వతంత్ర ప్రతిపత్తినీ - ఉనికినీ పరిరక్షించుకొనుటకై చేస్తున్న కృషికి ఎంతగానో తోడ్పడుచున్నారు. పదహారు మంది సహాయ (యువ) న్యాయవాదులతో కూడిన ఆఫీసు కలిగి ఎప్పుడూ తీరిక లేనంతగా ఉండేవారు శ్రీ వెంకటరత్నం గారు. అయినా ఆయన పై సమాఖ్యకు ఎంతో సహాయంగా ఉంటున్నారు.

ఈ సందర్భంగా జరిగిన సభకు సదరు యువజన సంఘాధ్యక్షులు శ్రీ ఏల్చూరు అశోక్ కుమార్ గారు అధ్యక్షత వహించారు. రాజంపేట లోని శ్రీ వాసవీ దేవ్యాలయములో జరిగిన ఈ సభలో ఈ పత్రికా సంపాదకులు శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి, నంద్యాల వాస్తవ్యులూ, ప్రసిద్ధ న్యాయవాదులు, పై సమాఖ్య న్యాయ సలహా సంఘ సభ్యులూ అయిన శ్రీ సి.వి.సత్యనారాయణ శ్రేష్ఠి గారలు ముఖ్య అతిథులుగాను, శ్రీ మెంటా పాండు రంగయ్య గారు ప్రధానోపన్యాసకులు గాను పాల్గొన్నారు. స్థానిక న్యాయవాదులు శ్రీ వంకదారు శ్రీనివాసులుగారు చేసిన జ్యోతి ప్రజ్వలనతో సభ ప్రారంభమైంది.

## వివాహం

కర్నూలు జిల్లా నంద్యాల పుర ప్రముఖులూ, శ్రీశైలదేవస్థాన ధర్మ కర్తృత్వ మండలి సభ్యులూ శ్రీ భవనాశి శ్రీరామమూర్తిగారి కుమారులు చి॥శ్రీనివాస్ వివాహం, బళ్ళారి వాస్త వ్యులు కీ॥ శే॥ ముత్యాల సహదేవయ్య గారి కుమార్తె చి॥ప్రతిమతో 13.4.1995 వ తేదీన బళ్ళారి సత్యనారాయణ పేట లోని శ్రీ రాఘవేంద్రస్వామి కళ్యాణ మండపములో వైభవంగా జరిగింది.

**గమనిక :** ఈ పత్రికలో ప్రతినెలా సీరియల్‌గా ప్రచురించబడుచున్న "నేను-నాదేశం", "రామచరిత మానసం" అనువాటిని అనివార్య కారణాలవల్ల ఈ సంచికలో ప్రచురించలేక పోయినందులకు చింతిస్తున్నాము. - సంపాదకులు




(రైతులోకానికి మా శుభాకాంక్షలు)

మీ పొలాల్లో పెరిగే పైరకు
వచ్చే తెగుళ్ళకు

**మా " జ్యోతి బ్రాండు " మందులనే వాడండి**

మాచే తయారుచేయబడే గెమాక్సిన్ 5%, 10%, B.H.C. 10% Dust & 50 % WDP, Malathion 5% Dust & 50% EC, Endosulphan 35% EC, Monocrotophos 36% WSC, Quinolphos 25% EC, Dimethoate 30% EC, Methyl Parathion 50% EC, Cypermethrin 10% EC, Fenvalrate 20% EC, మొదలగు క్రిమిసంహారక మందులు దేశవ్యాప్తంగా ఉపయోగించబడి తెగుళ్ళ నివారణకు అమోఘంగా పనిచేయుచున్నవి.

## ఆదిత్యా మినరల్ ట్రేడర్స్

కొండాపురం ( R.S.) కడపజిల్లా. PIN - 516 444

# Vasavi

## వాసవి

వైర్లు మరియు పైపులు





**నాణ్యతకు, మన్నికకు, పేరెన్నిక గన్నవి**

తయారుచేయు వారు :

వాసవీ ఇండస్ట్రీస్
18/638 - బి, గుత్తిరోడ్,
గుంతకల్ - 515 801

'VASAVI INDUSTRIES'
18/638-B, Gooty Road,
GUNTAKAL - 515 801

## ఆనందించాము

ఆర్యా!

గత (మార్చి) నెల వైశ్యప్రబోధినిలో ప్రచురితమైన, విజయవాడలో జరిగిన కేసెట్ విడుదల, బిరుద ప్రదాన, శాసన సభ్యుల సన్మాన, అవార్డు ప్రదానముల విశేషాలను చదివిన మేము ఎంతో ఆనందించాము. అట్టి మంచి కార్యక్రమం కడప జిల్లాలో జరుగక పోయి నందులకు విచారం కలిగింది.

దోరణాల వెంకటసుబ్బయ్య శ్రేష్ఠి
ఇందుకూరు. తేది : 1.4.95

## కళ్ళకు కట్టినట్లుగా ఉంది

ఆర్యా!

మార్చి (1995)నెల వైశ్యప్రబోధినిలో విజయవాడలో జరిగిన కేసెట్ విడుదల-అవార్డు ప్రధానము - శాసనసభ్యుల సన్మానం - బిరుద ప్రదానాది కార్యక్రమాలను మాకు కళ్ళకు కట్టి చూపించినట్లుగా చాలా చక్కగా రిపోర్టు చేశారు. అనుకున్న ప్రకారమూ కార్యక్రమాన్ని నిర్వహించి, అందరి మన్ననలనూ పొందారు. ఆ కార్యక్రమాన్ని చూడనివారు కూడ తమ విశ్లేషణతో కూడిన ఆ వ్యాసాన్ని చదివి ఆనందపడినారు.

వక్కలగడ్డ సూర్యప్రకాశరావు
నర్సరావుపేట తేది : 27.03.95

కడప జిల్లా ఇందుకూరు గ్రామ ప్రముఖులు శ్రీదోరణాల వెంకటసుబ్బయ్య శ్రేష్ఠి గారి కుమార్తె చి॥ సుజాత వివాహం, సదరు జిల్లా అగుడూరు గ్రామ ప్రముఖులు శ్రీ ఇట్టా సుబ్బరాయుడు శ్రేష్ఠి గారి కుమారులు చి॥ రమేశ్ బాబుతో 24.2.95వ తేదీన కడప జిల్లా యర్రగుంట్లలోని శ్రీ రామాలయములో వైభవంగా జరిగింది.

కడప జిల్లా వైశ్య ప్రముఖులూ, ఎ.పి. స్టేట్ వేరు హౌసింగు కార్పొరేషను మేనేజరూ శ్రీ యన్.వి.రమణయ్యగారి కుమారులు చి॥ప్రభాకర్ వివాహం, పులివెందుల శ్రీ పబ్బతి సుబ్రమణ్యం శ్రేష్ఠి గారి కుమార్తె చి॥సరితతో 10.2.95వ తేదీన పులివెందుల లోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయములో వైభవంగా జరిగింది.

అనంతపురం జిల్లా తాడిపత్రి వాస్తవ్యులూ, స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా అకౌంటెంట్ శ్రీ టి.వి.రమణయ్య గారి కుమార్తె చి॥లత వివాహం, కర్నూలు జిల్లా వెల్దుర్తి శ్రీ చాటకొండు మల్లయ్య గారి కుమారులు చి॥ రామప్రసాద్ గారితో 12.12.94వ తేదీన వెల్దుర్తిలోని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయములో వైభవంగా జరిగింది.

అనంతపురం జిల్లా పామిడి వైశ్య ప్రముఖులు, మాజీశాసనసభ్యులు శ్రీ కె.సి. శ్రీరంగయ్యశ్రేష్ఠి గారి కుమారులు చి॥ప్రకాశ్ బాబు వివాహం, ప్రొద్దుటూరు శ్రీ నగరూరు వీరభద్రయ్య శ్రేష్ఠి గారి కుమార్తె చి॥కల్యాణి తో 12.3.95వ తేదీన ప్రొద్దుటూరులోని శ్రీ కొప్పరపు సుబ్బయ్య మెమోరియల్ హాలులో వైభవంగా జరిగింది.

***గమనిక :*** *ఈ శీర్షికన ప్రకటన కావాలనుకునే వారు వివాహ శుభలేఖతో బాటు రూ.116/-లు యం.ఓ. లేక డి.డి. ద్వారా పంపాలి.*

# చక్కెర వ్యాధి, రక్తపోటు (బీ.పి.) పూర్తిగ బాగైనది



డా.గ్రంధే రఘురామ గుప్త

'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంధే రఘురామగుప్త గారికి, (మార్కాపురం. ప్రకాశం జిల్లా -, 523 316.)

ఆర్యా !

నమస్సులు. నేను 20 సం॥లుగ బి.పి. తోను 10 సం॥లు పైగా షుగర్ వ్యాధితోను పీడింపబడితిని. ఎన్నో విధములగు ఔషధములు సేవించితిని. మద్రాసులోని డయాబెటిక్ రీసర్చ్ సెంటర్‌కు 3 పర్యాయములున్ను, ఢిల్లీలోని రాంమనోహర్ లోహియా ఆస్పత్రిలో ఒకసారి పరీక్షలు చేయించుకొని వారి సలహామేరకు ఔషధములు సేవించితిని. కాని, సదరు మందులు సేవించునంత వరకు మాత్రమే వ్యాధులు తగ్గుచుండెడివి. మీరిచ్చిన ఔషధములు నేను పథ్యము లేకుండ 10 మాసములు సేవించితిని. మీ ఔషధ ప్రభావము వలన, నాకు 6 మాసములకు పూర్తి ఆరోగ్యము కలిగినది. ఇప్పటికి ఒక సం॥నకు పైగా నాకు ఆ రోగ చిహ్నములు లేవు. నేను అపుడపుడు తీపి పదార్థములు కూడ తినుచున్నాను, మీ సిద్ధవైద్యమునకు నా నమస్కారములు.



డా. జి.వెంకట ప్రసాద్

ఏనుగు చెట్టు వీధి,
ఒంగోలు. ప్రకాశం జిల్లా.
10.7.92.

భవదీయుడు
(Sd.) కొణిజేటి శ్రీమన్నారాయణ,
మాజీ మునిసిఫల్ కౌన్సిలర్

# ఈ నెలలో మీ కర్తవ్యము

***(21.4.1995 నుండీ 20.5.1995 వరకు)***

మీ వ్యాపార సంస్థ ఇప్పుడు అమలులో వున్న ఆదాయపుపన్ను చట్టములోని 194 విభాగము మేరకు డివిడెండ్ల నుండీ వచ్చు ఆదాయములపై పట్టుకొన్న మొత్తం వివరాలను తెలుపు రిటర్నును అనగా ఫారం నెం.26ను పూర్తిచేసి ఈ ఏప్రిల్ నెల 30వ తేదీలోగా చేరునట్లుగా అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి అందజేయాలి.

అమ్మకం పన్ను చట్టానికి సంబంధించి ఈ 1995వ సంవత్సరం మార్చి నెల 31వ తేదీతో అంతమయ్యే ఆర్థిక సంవత్సరములో రెండు లక్షలకు మించని టర్నోవరు గల వర్తకులూ, ప్రతి నెలా A-2 రిటర్నును పంపని వర్తకులూ తమ సంవత్సరాంతపు వ్యాపార నికర మొత్తము (టర్నోవరు)ను తెలియజేయు ఫారం A-1ను పూర్తిచేసి ఈ (ఏప్రిల్) నెల 30వ తేదీలోగా అందునట్లుగా అందుకు సంబందించిన అమ్మకం పన్ను శాఖ అధికారికి పంపడం మరచిపోరాదు.

మీరు పంపవలసిన A-2 రిటర్నును చలనాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి పంపుటకు ఈ (మే) నెల 20వ తేదీయే చివరిది - ఈ విషయాన్ని మరచిపోకండి. మీరు పంపు A-2 రిటర్నును చలానాతో బాటు కాకుండా చెక్కుతో బాటు పంపాలనుకున్నారా? అయితే ఆ విధంగా A-2 రిటర్నును చెక్కుతోబాటు పంపుటను ఈ మే 15వ తేదీలోగా చేయాలి.

అమ్మకం పన్ను చట్టము క్రింద పొందిన మీ "రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్"ను పునరుద్ధరించుకొన్నారా? లేకుంటే రూ.100/-లు చలానా ద్వారా చెల్లించి మీకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి ఆ చలానాతో బాటు దరఖాస్తుచేసి, మీ రిజిస్ట్రేషను సర్టిఫికెట్‌ను పునరుద్ధరించుకోండి.

అత్యవసర వస్తువుల చట్టము క్రింద విజిలెన్సు ఆఫీసర్లు చేయు తనిఖీల విషయములో ప్రభుత్వం విడుదల చేసిన మార్గదర్శక సూత్రాల ప్రకారం రెండు (2) లక్షలకు లోపు టర్నోవరు గల వర్తకుల దుకాణాలను విజిలెన్సు ఆఫీసర్లు తనిఖీ చేయరాదు. ఈ సౌలభ్యమును పొందుటకు వీలుగా రెండు లక్షలకు లోపు టర్నోవరు కలిగి 31.3.1995వ తేదీతో అంతమగు ఆర్థిక సంవత్సరము సంవత్సరాంతంగా గల వర్తకులు తమ టర్నోవరును తెలుపు డిక్లరేషనును ఈ నెల 30వ తేదీ లోగా వారి, వారికి సంబంధించిన లైసెన్సింగు అధికారికి పంపడం మరిచి పోకుండా చేయాల్సిన పని అని గుర్తుంచుకోవాలి.

వైశ్యప్రబోధిని, ఏప్రిల్, 1995

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

మార్కాపురం 3140, 3114,

## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సంగలో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వతసభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.116/-లు చెల్లించిన వారికి సంవత్సరంనకు ఒకసారి ప్రసాదం పంపించబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సంగలో 30 రోజులు ఇవ్వబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు

యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల :</u> తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో మరియు పేరు శిలాఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయల నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. తిరుమల మేదరిమెట్ట ప్రాంతంలో మనము కట్టుచున్న సత్రం దగ్గర కట్టిన షెడ్డులో తాత్కాలిక కార్యాలయం ప్రారంభించినాము.

4. <u>వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.</u>

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణము చేసి క్రింద భాగములో వైశ్యులు కళ్యాణంలు చేసుకొనుటకు గాని, యితర సమావేశములు, శుభకార్యములు చేసుకొనుటకు గాని తయారుచేస్తూ, మొదటి అంతస్తులో భోజనహాలు నిర్మాణం చేసి, నిత్య భోజనములు, రెండవ అంతస్తు నుండి వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు తీర్మానించినాము. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళంలు సమర్పించకోర్తాము.

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. రూము సైజు 200 చ.అ. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వ్రాయబడును.

వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో-దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

M.Tech., ప్యాసు అయిన వారికి యీ సంవత్సరము రు.3500/-ల ప్రకారం ముగ్గురికి యివ్వబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు 1995లో స్వామి అనుగ్రహం మేరకు పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,
మార్కాపురం - 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అ ులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

**N.B :-** పై సత్రముల పేరుతో - D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1995 ఏప్రిల్ 21 నుండీ 1995 మే 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 23 | 30 | 7 | 14 |
| సోమవారము | | 24 | మే 1 | 8 | 15 |
| మంగళవారము | | 25 | 2 | 9 | 16 |
| బుధవారము | | 26 | 3 | 10 | 17 |
| గురువారము | | 27 | 4 | 11 | 18 |
| శుక్రవారము | 21 | 28 | 5 | 12 | 19 |
| శనివారము | 22 | 29 | 6 | 13 | 20 |

ఏప్రిల్ 21 :- మంచి శుక్రవారము (గుడ్ ఫ్రైడే)

ఏప్రిల్ 27 :- భరణీ కార్తె ప్రారంభం.



ఏప్రిల్ 30 :- ఆదాయపు పన్ను చట్టము క్రింద డివిడెండ్ల నుండీ వచ్చు ఆదాయములపై పట్టుకొన్న మొత్తము వివరాలను తెలుపు రిటర్ను 26వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

మే 1 :- ప్రపంచ కార్మిక దినము. దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలలో పనిచేయు ఉద్యోగులకు జీతముతో కూడిన సెలవు దినము.

మే 10 :- శ్రీ వాసవీ జయంతి.

మే 11 :- నిజకర్తరి - బక్రీదు పండుగ - కృత్తిక కార్తె రాక రాత్రి 10.21

మే 14 :- వైశాఖ పూర్ణిమ - వ్యాస పూర్ణిమ. అర్ధనారీశ్వర వ్రతం.

మే 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు రోజు.

మే 17 :- బుద్ధ జయంతి.

మే 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి తేది.

**23, 30, 7, 14 ఆదివారాలు**

---

*నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# అసెంబ్లీ ఆమోదించిన కొత్తపన్నుల తీరుతెన్నులు

## సాధారణ అమ్మకపు పన్ను సవరణ అనంతరం సింగిల్‌పాయింట్ వర్తించే సరుకులు

| వ.సంఖ్య (1) | సరుకుల వివరములు (2) | విధింపుపాయింటు (3) | పన్నురేటు (4) |
|---|---|---|---|
| 1. | మోటారుకారు, మోటారు టాక్సీ-క్యాబులు, మోటారు సైకిళ్లు, మోటారు సైకిలు సంయోజనములు, మోటారు స్కూటర్లు, మోటారెట్లు, మోటారు అమ్నీ బస్సులు, మోటారు వ్యాన్లు, మోటారు లారీలతో సహా మోటారు వాహనములు, (బాడీలకు సంబంధించిన టర్నోవర్‌పై) ఇతరులకు చెందిన మోటారు వాహనముల ఛాసీస్, మోటారు వాహనముల విడిభాగములు, (ఏ పేరుతో పిలిచినను) అన్ని రకముల ట్రెయిలర్లు, సీటు కవర్లతో సహా మోటారు వాహనముల ట్రెయిలర్ల భాగములు, ఉపసాధనములుగా సాధారణముగా ఉపయోగించుటకైన వస్తువులు (బ్యాటరీలు మినహా) | మొదటి అమ్మకపు పాయింటు వద్ద | రూపాయిలో 16 పైసలు |
| 2. | పొలిస్టరీస్, ఫోమ్ వంటి రిఫ్రజరేషన్ సామగ్రులతో సహా, రిఫ్రజరేటర్లు, ఎయిర్ కండిషనింగ్ ప్లాంట్లు, వాటర్ కూలర్లు, రూమ్ కూలర్లు, వాటి భాగములు, ఉప సాధనములు. | -డిటో- | -డిటో- |
| 3. | వైర్‌లెస్ రిసెప్షన్ ఇనుస్ట్రుమెంట్స్, మరియు అపరేటస్, రేడియోలు, రేడియో గ్రామఫోన్లు, టెలివిజన్లు, ఎలక్ట్రికల్ వాల్వులు, అక్యూమ్ లేటర్లు, అంప్లిఫయిర్లు, మరియు లౌడ్ స్పీకర్లు వాటి విడిభాగములు ఉపసాధనములు. | -డిటో- | -డిటో- |
| 4. | కెమేరాలు, ప్రొజక్టర్లతో సహా సినిమాటోగ్రాఫ్ సౌండ్ రికార్డింగు, రిప్రొడ్యూసింగ్ ఎక్విప్‌మెంట్ లెన్సులు, ఫిల్ములు, అందుకోసం ఉపయోగించవలసిన భాగములు ఉపసాధనములు. | -డిటో- | -డిటో- |
| 5. | వదలివేయబడినది. | | |
| 6. | వదలివేయబడినది. | | |
| 7. | వదలివేయబడినది. | | |

